# ఆంధ్రరాష్ట్రము

7-6-1942

*

వారణాసి
వేంకటేశ్వరులు

*



♦ సాహిత్యకుటీరము ♦
గొట్టిపాడు-చిలకలూరిపేటపోస్టు

# పీఠిక.

క్రీ. శ. 1909 సం. వరకు మనము తెలింగులము ! ఆంధ్రదేశానికి నాయకమణి ఐన గుంటూరు నగరములో కొందరు పెద్దలు "మనము ఆంధ్రులమనీ, ఆంధ్రరాష్ట్రము నిర్మించాలెననీ" సంకల్పించారు. కొంతయత్నము జరిగింది. ఇప్పటికి ఫలితము లేదంటే కృషిలో లోపమే అనుకోవాలె.

భాషా విభాగాన్ని పట్టి రాష్ట్ర నిర్మాణము చెయ్యవలెనని కాంగ్రెసువారుకూడా ఆమోదించారు. రాష్ట్రనిర్మాణము త్వరలోనే అవుతుంది.

యావద్భారత భూమికి సామాన్యభాష ఒకటే ఉంటే ఐకమత్యానికి ఆధారభూతమవుతుంది. ఐతే వివిధభాషలు వృద్ధి పొంది సాహిత్యాలు పెరిగి ప్రతిదానికీ విశిష్టత కావలెనని కోరేటప్పుడు ప్రత్యేకరాష్ట్రాలు నిర్మించక తప్పదు. ఆంధ్రోద్యమం వెనుకటికంటే ఇప్పుడు తీవ్ర రూపం దాల్చింది.

లోకంలో కవులకు, ముందుగా ఉద్దీపన కలుగుతుంది. వారు వివిధ విధాల ప్రబోధము కలిగిస్తారు. కొందరు కవులు దూకుడుగాను, కొందరు మృదువుగాను రచనలుచేస్తారు. కొంతమందికి అన్యనిరసనము, అసహిష్ణుత, హెచ్చుగా ఉంటవి. అటువంటి భావాలు విడిచిపెట్టి ప్రాచీనౌన్నత్యాన్ని స్మరిస్తూ ప్రకృతోద్ధరణకై పద్యరచన చేసేకవులు ప్రశంసాపాత్రులు.

ఈకవి ద్వేషమార్గంలో వెళ్లక, అంతా ఆంధ్రమయవే కావలెనని ఆలాపనచెయ్యక మృదువైఖరిలో ఆంధ్రాభివృద్ధి అభిలషిస్తూ రచించినట్లు పద్యాలవల్ల ప్రస్ఫుటమవుతున్నది. ఆంధ్రరాష్ట్ర మను నామమే ఆయాశయాన్ని విశద పరుస్తున్నది. ఇందులో సీసపద్యాలు, వృత్తాలు మధురముగా అందమైన నడకలతో ఆహ్లాదకరముగా ఉన్నవి. ప్రధాన విషయాన్ని బహుగతుల వివరిస్తూ కవిచేసిన ఉద్బోధనలలో శిల్పనైపుణి చక్కగా కనబడుతున్నది. పత్రికాముఖమున ప్రకటితమైన ఇందులోని ఘట్టాలు ఇదివరకే ఆదరపాత్రమైనవి. ఈసంస్కృతి సహృదయరంజకము ఔతుందని నా ఆశయము.

తల్లావఝల శివశంకరశాస్త్రి

నవ్యసాహిత్య పరిషత్తు
గుంటూరు. నవంబరు.5

# * కృతి సమర్పణము *

తల్లియుఁ, దండ్రియు, ధరణీపతి, గురుండు
సత్కీర్తి, సద్విద్య, సత్యదీక్ష
దేవ! లోకప్రభూ! దీన రక్షామణీ!
నీయంశలేయౌచు నెగడుచుండుఁ
గావున మత్పిత ఘనకీర్తి, సంతత
సూనృత సద్గుణ శోభితుండు
పుణ్యప్రదంబైన ముక్కోటి యేకాద
శీ వ్రతనిరతుండు, శిష్టుఁడు, బహు
మంత్ర తంత్ర విదుం, డసమాన హాస్య
భాషణాంచితుండు, దయాస్వభావపరుఁడు
నమరలోక పూజ్యుఁడు, లక్ష్మయార్యవరున
కర్పణము సేతు నీకృతి నధికభక్తి!

*

# అంజలి



నానా నరాధీశ నవరత్నకోటీర
నతపాదపద్మ శోభితవు నీవు
కమనీయ సద్భావ కలిత కవీశ్వర
సుందరకావ్య సంస్తుత్య వీవు
గంధర్వ నిభభవ్య గాయక కులవర్య
మృదుగేయ దివ్య చారిత్రవీవు
బహుదేశ వీరేశ భక్తి బంధురభావ
నీరజ సంపూజనీయవీవు
స్పర్శమాత్రి పుణ్యావహ పరమనిమ్న
గా నివహ విశేష విరాజమానవీవు
అతి వినమ్రత నీకు నే నంజలిడుదు
నఖిల సౌభాగ్య సముపేత! ఆంధ్రమాత!





# ఆంధ్రమాత!

కొండపటంబును గట్టి తిక్కనయజ్వ
కవితాసుధావృష్టిఁ గ్రమ్మునాఁడు
శ్రీనాథకవినాథ శిరముపైఁ గనకాభి
షేకంబు నెలమిమై చేయునాఁడు
పోతనామాత్యుని పూరింట శారద
కాటుకకన్నీరు గార్చునాఁడు
అల్లసానికవీంద్రు నందలంబును గేలఁ
గృష్ణరాయనరేంద్రుఁ డెత్తునాఁడు

పైఁడిగంటమ్ముఁ గెంగేలఁ బట్టి, కాళి
రామకృష్ణుని జిహ్వపై వ్రాయునాఁడు
కలిగియుండిన మేలైకతఁ గాంతునేమొ?
అపుడు నన్నేలఁ గనవైతి వాంధ్రమాత!

బాలచంద్రుని భుజాబలవినిర్ముక్తమై
క్షాత్రరేఖలు దిశల్ గప్పునాఁడు
అనపోతజనపాలు నతిశయుగ్మాగత
ప్రబలతేజము కడల్ ప్రాకునాఁడు

# ఆంధ్ర రాష్ట్రము

కృష్ణరాయావనీజిష్ణు రాష్ట్రమున, వి
క్రమ మరీచి కవిసి దుముకునాఁడు
చిత్తూరు రాణ్మౌళి శితఖడ్గధారల
శౌర్యకీలలు స్ఫారి సలుపునాఁడు

అలరియున్న వీరప్రతాపాగ్నికాంతి
చూఁచియుండెడి విభవమ్ము నోఁచియున్న
భీతి లేకుండు మాయింటి పిల్లికైన
అపుడు నన్నేలఁ గనవైతి వాంధ్రమాత!

వీర రసపుటేటి వెల్లువ పలనాట
నాగులేట గమించి సాగునాఁడు
కాకతీయనరేంద్ర కదనవిజయకీర్తి
జెండాలపై వెల్గుచుండునాఁడు
రెడ్డిఱేఁడుల పేరువడ్డ పౌరుషధాటి
తెలుఁగుగడ్డకు వన్నె దెచ్చునాఁడు
విజయనగరరాజ వీరధైర్యస్మృతు
లరులమూఁకకు గుండె లడలునాఁడు

ప్రజ్వరిల్లిన శౌర్యాగ్ని పథముఁగాంచ
గుండె కింతటి పిఱికిపాటుండదేమొ?
దాస్యవృత్తిని బొత్తుగాఁ దలఁపనేమొ?
అపుడు నన్నేలఁ గనవైతి వాంధ్రమాత!

పసుపుమంచము వెట్టి పత్ని హేళన సేయ
        సమరానఁ దిక్కాన దుముకునాఁడు
తనవారి నాశమ్ము విని పాపరాయఁడు
        విజయరామునిఁ జంప వెడలునాఁడు
మానరక్షణకునై మల్లమాంబాదేవి
        యురువహ్నికీలలం దురుకునాఁడు
మాటపట్టింపుకై మలఁగి, రుద్రమదేవి
        ఘోరసంగ్రామంబు గూర్చునాఁడు
తోఁచు భీభత్స దృశ్యముల్ జూచియున్న
వీర రక్తంబు నామేనఁ బాఱుచుండ
గానమొనరింతు మా వీరగాథ లెపుడు
నెపుడు నన్నేలఁ గనవైతి వాంధ్రమాత!

అమితమోహానగాన మాత్యాగరాయలు
        మోడులు జివురింపఁ బాడునాఁడు
యక్షిణీవిద్య విద్యలభాస్కరుఁడు, చిత్ర
        చిత్రమ్ముగాఁ బ్రదర్శించునాఁడు
తిరుమలక్షేత్రానఁ దరిగొండ వేంకమ
        ప్రాంచిత మహిమ జూపించునాఁడు
కడునాదరమున డొక్కా సీతమాంబిక
        నిరతాన్నదానంబు నెరపునాఁడు

## ఆంధ్ర రాష్ట్రము

చెలఁగియుండిన వైభవ శ్రీవిలాస
మును గనుంగొను పుణ్యంబు పొనరియున్న
స్వాంత మందెంతగా నేను సంతసింతు!
నపుడు నన్నేలఁ గనవైతి వాంధ్రమాత!

ఏవంక బరికింపఁగేవల స్వాతంత్ర్య
    దీక్షానిబద్ధమై తిరుగునాఁడు
ఏఱేని సభఁ జూడ నింపారు కవితాశు
    ధారాప్రవాహంబు పాఱునాఁడు
ఏపీటఁ గనుఁగొన్న జీవకళలతోడ
    శిల్ప శృంగారంబు సెలఁగునాఁడు
ఏసతీవదన మందేని పాతివ్రత్య
    విమల తేజోరాశి వెలయునాఁడు

కన్నులారంగ వీక్షింపఁ గలిగి యున్న
కీరితి నెలంత నాయందఁ జేరునేమొ?
అందఱును నన్నుఁగొనియాడుచుందురేమొ?
అపుడు నన్నేలఁ గనవైతి వాంధ్రమాత!



# ఆంధ్రదీప్తి

౧

శ్రీకీర్తికలితమై చెలువమ్ముఁ జెంది
ప్రాకట బిరుద సంభారమ్ము నంది
వేదమ్ములకు శోభ వెలయించునట్టి
యైదవ వేదము ననువదించినది.
సలలితభక్తి ద్రాక్షారామ భీము
నలిఘు మాహాత్మ్యంబు నలరారఁ జేసి
బహుదేశ సంస్తుతుల్ బడయఁజాలినది
మహనీయమై యొప్పు మా యాంధ్రదీప్తి!

౨

"ఏటికి దుఃఖింతువే తల్లి!" యంచుఁ
గాట్కుక కన్నీరు కడిగి శారదకు
కుసుమదామంబులు కొప్పులోఁ దురిమి
పసుపుఁ గుంకుమ, పండ్లు వాయనం బిచ్చి
పుట్టింటి మర్యాద పూర్తిగా నెరపి
మెట్టినింటికిఁ బంపి మిగుల మోదమున
అధిక గౌరవ పదం బధిగమించినది
మధురమంజరిలీల మా యాంధ్రదీప్తి!

3

ఏనుఁగంబారిపై నెక్కి యూరేగి
దీనారటంకాలఁ దీర్థమాడినది.
"తెనుఁగు లెస్సగు సుమీ దేశభాషలను"
అని ప్రతిజ్ఞను జేసి యతిశయిల్లినది.
ధారుణీశ్వరమౌళి తన కేలనెత్త
నూరేగె, పాలకీ నొప్పుగా నెక్కి
కాళీకేశ్వరి దివ్య కారుణ్యసుధను
లీలగాఁ గ్రోలఁ జాలిన దాంధ్ర దీప్తి!

4

అపజయంబే లేక యరిధారుణీశ
విపులరాజ్యము గెల్చి వెలుఁగుఁ జెందినది.
దుర్గమంబుగ నుండు దుర్గముల్ గట్టి
స్వర్గరాజ్యశ్రీని సవదరించినది.
అసమాన శూరులౌ యస్య రాజులను
గుసుమ కోమలలచేఁ గూలఁ జేసినది
లలిత విక్రమరేఖలను దేశములను
మలయించి పేరొందె మా యాంధ్ర దీప్తి!

5

కుక్కలఁ దోలించి కుందేళ్ళచేతఁ
జక్కఁగా నాఁటించె జయపతాకముల

సులత్రాను బంధించె చోద్యంబు గదుర
విల్లసిల్లు మంత్రాంగ విజ్ఞాన గరిమ.
పైనున్న భాస్కరప్రతిమాన తేజు
రాణింపఁజేసె విరాజమానముగ.
ఖానురాజ్యమునందుఁ గడు ధర్మనిరతి
మానుగాఁ బ్రకటించె మాయాంధ్రదీప్తి!

౬

వీరరసము రాశి వేగాన్వితముగఁ
బాఱించె సెలయేటి వలెఁ బలనాట.
విఱుగుపాలను బోయ వీక్షించి, యనికి
పరువెత్తి నిజశౌర్యపటిమఁ జాటినది.
మదపుటేనుగుల బారు మహిఁ బడఁద్రోసి
విదితంబుఁ జేసె మావీర దోర్బలము.
భీకరదాజిని శత్రు పృథ్వీశు నైనఁ
జేకొని రక్షించె శ్రీయాంధ్రదీప్తి!

౭

చెట్టునుండి ప్రార్థించి శ్రీరామచంద్రు
తురకఱేనికి ప్రేమతోడఁ జూపించె.
పుచ్చకాయల లోనఁ బుత్తడిఁ జూపి
హెచ్చు గౌరవము వహింపఁ గల్గినది.

తిరుమలసుక్షేత్ర దేవధామమున
తిరమైన మహిమంబు దిద్దితీర్చినది.
'లా' కేత్వమును బొల్లు ఉలి'దా' కుకొమ్ము
నీక పొల్పార లేదే! యాంధ్ర దీప్తి!

౮

ఎండిపోయిన ప్రాంతములెల్లఁ జివురింప
బండలే ద్రవియించి వాగులై పాఱ
కమనీయ భావ సంకలితమ్ము నైన
యమిత మోహనగాన మాలపించినది.
ఎనలేని సింగార మింబారు నట్టి
ఘనశిల్పచాతురీగరిమఁ జూపినది.
పరసీమలను గూడ వాణిజ్యకలను
స్థిరముగా నెలకొల్పె దివ్యాంధ్రదీప్తి!

౯

నాఁటి సాహిత్యమ్ము నాఁటి మహిమము
నాఁటి కవిత్వమ్ము నాఁటి పాలనము
నాఁటి శౌర్యస్ఫూర్తి నాఁటి పౌరుషము
నాఁటి ధీరత్వమ్ము నాఁటి సాహసము
నాఁటి మంత్రాంగమ్ము నాఁటి తంత్రమ్ము
నేఁటికి మాసీమ నెగడుచుండినవి.

ఏటి కింకను రాష్ట్ర మిచ్చెదు మాట
బొటింప కుందురు పాలకోత్తములు?

౧౦

'మన కేమిలే' యంచు మసలఁబోవకను
వెనుక కొక్కడుగైన వేయఁబోవకను
తెలుఁగు గడ్డను బుట్టి తెనుఁగుఁ బ్రేమించి
తెనుఁగు తల్లికి స్వేచ్ఛఁ దెప్పించు వఱకు
తెనుఁగుల రాష్ట్రమ్ము దీపించు వఱకు
కను మూయఁబోవక కార్యరంగమున
నురుకుమయ్యా! ఆంధ్ర! ఉరుగుణసాంద్ర!
భారత దేశాంబుధి పరిపూర్ణచంద్ర!!

# ఆంధ్రలక్ష్మి

అరిభూపాలుర యుద్ధరంగమున దివ్యధైర్య శౌర్యోద్ధతి
స్ఫురణన్ గెల్చి జయప్రమోదమున నిర్వ్యాజించు న్నాంధ్రావనీ
నరనాథేంద్ర శిరస్థలీ మకుట రత్నంబుల్ ప్రకాశించె, నీ
చరణాబ్జంబుల నెన్నఁడో; యిపుడు గాంచన్ స్వప్నవృత్తాంతమా!

అలనాఁడా కృతికన్యకామణుల కళ్యాణంబులున్, రత్నశా
లలలో లీలగఁ బైఁడినాణెములఁ దీర్ఘంబాడుటల్, కాంచనాం
చల దివ్యాంబర దానముల్, సుకవితా సమ్మానముల్, హేమపా
త్రల మృష్టాన్నపు భోజనంబులును మాతా! నేఁడు కన్గొందుమా!

కోరిన తెల్గు మేల్కొయితకున్ రతనాల పసిండి గండపెం
డారపుఁ బారితోషికము, డంబు సెలంగెడు కొమ్ము టేన్గులం
బారుల సంబరంబులును, బాలకిపైఁ బురమేగు మేటి సిం
గారములున్ లభించె, నికఁ గాంతుమె యంతటి వైభవోన్నతుల్!

గుండెలు మెండు బెగ్గడిలు కొండల కోనల కోటగోడలన్
గండరగండ తండములు గల్గి రహించిన దండి దండులన్
జండపరాక్రమోజ్జ్వల విశాల యశస్థిరు లాంధ్రరాజులన్
వెండి వెలుంగఁ జేయు పదవిం బొదలింతువె తెల్గుతల్లిరో!

కనుపింపరే ! ఆంధ్ర కవితాప్రసాదంబు
వెట్టిన నన్నయభట్టు లిపుడు
వెలుగొందరే ! ఆంధ్ర విజయ పతాకంబు
నాఁటిన కృష్ణభూనాథు లిపుడు
రహింపరే ! ఆంధ్రమహిమంబు భాసిల్లఁ
జేసిన యల రామదాసు లిపుడు
వినిపింపరే ! ఆంధ్ర విమల గాంధర్వంబు
నాలపించిన త్యాగయార్యు లిపుడు

విదితముం జేయరే ! ఆంధ్రవీరపటిమ
కదన సింహులు ఖడ్గతిక్కన్న లిపుడు
తనరఁజేయరే ! ఆంధ్రవదాన్యగరిమ
ఘన యశస్కులు మంత్రిభాస్కరులు నిపుడు.

పొనరార దీనాఁడు తెనుఁగుకైత నెలంత
రాణ్మహేంద్ర పురీ వరమ్మునందు
పొలుపార దీపొద్దు తెలుఁగుల శౌర్య ల
క్ష్మీచిహ్నతతి 'హంపి' క్షేత్రమందు
చెలువార దీవేళ శిల్పనై పుణ్యంబు
నమరావతీస్తూప సమితియందు
తనరార దీయెడ ఘనదుర్గరాజమ్ము
కొండవీటను బొల్చు కొండలందు

లంగరుల దింపివేసి సరంగులెల్ల
హాయిమెయి శ్రుతిలీయమౌ స్థాయిత్రోడ
నోడపాటలుపాడుచునుండు నాఁటి,
యోడరేవులు లేవంబ! నేఁడు మాకు.

తెలుఁగు వెలుంగు నెల్లెడలఁ దెల్లముఁగాఁగ నభంబునంటి, కే
వలము స్వతంత్ర చిహ్నముగ భాసిలినట్టి తెలుంగుబావుటా
వెలుఁగును బాసి వాసిచెడి వీసరవోయిన దమ్మ! నేఁడు నే
లవి వెలయింతుమో తెనుఁగురాచరికంపుఁ బతాకమీఁ దెడన్.

తెనుఁగుం గీరితి పండువెన్నెలల కాంతిన్ దేశదేశాలలో
వెలుఁగంజేసిన యాంధ్రనాయక మహావీరాలి వీరప్రతా
పుల విశ్రాంతిగ నిద్రబుచ్చితివి; పొల్పున్నిల్పు దీపించు వా
రల రాష్ట్రోదయవేళ మేల్కొలుప కేలా జాలముం జేయఁగన్?

మెండున్నిండు ముదంబుతో విజయ లక్ష్మీశోభ నాఢ్యప్రభా
భండారం బగు తెల్గుజెండ నెరతేవన్ దాల్చి, రాష్ట్రోద్యమో
ద్దండాయోధన శాంతిసైనికులుగా దర్పించి పోరాడు మేల్
బండారంబును నేఁటి నీ సుతులకున్ బ్రాప్తంబుఁ గావింపుమా!

ఆరయ నాంధ్రదేశనిధియై తనరారిన సుస్వతంత్రతా
భూరి ఖరాసి జారి పడిపోయెను; దాస్యపిశాచ ఘోరదం
ష్ట్రారుచి మీయెడం బ్రబలసాగిన; వాంధ్రయశంబు నిల్పఁగా
నేరిమిఁ గూరిమిం బరపి నీవు సుతావళి నెట్లు బ్రోచెదో!

జననీ! యెన్నఁడొ యాలపించితివి స్వేచ్ఛామాధురీగీతికా
స్వనమున్ నాఁటి త్వదీయ సంతతి నిజస్వాతంత్ర్య సౌభాగ్య సం
జనితామోద భరంబున న్వెలుఁగ; నా శ్రావ్యంపు గీతామృతం
బును భోగించెద మొక్కసారి కరుణాస్ఫూర్తిన్ బ్రసాదింపవే.

నాఁటి వివిధాను భోగ సంధాత్రివగుచు
వితత సుశ్రీ యశస్సముపేత వగుచు
నాంధ్ర జాతీయతాభ్యుదయంబు సేయ
నవతరింపుము మాతల్లి! ఆంధ్రలక్ష్మి!!

# ఆంధ్రసోదరీ!

౧

ఆంధ్ర కవితా కలా విలాసాభ్యుదయము
నాంధ్ర రాజేంద్ర విపుల శౌర్యప్రదీప్తి
యాంధ్ర సచివోత్తమ ప్రతిభాతిశయము
నాంధ్ర గాయకో గాన విద్యావిభవము
నాంధ్ర మహిళా పతివ్రతా త్వాతిశయము
నాంధ్ర సూనృత దానధర్మాభిరతియు
నరసి, నాఁడు నీనాఁడు నేకొఱంత లేద
టంచు పొరుగువారికిఁ బ్రకటించు కొఱకు
నిరుపమాంధ్ర రాష్ట్రోద్యమ నిరతి నొరసి
యాంధ్రసోదరీ! చరియింపుమమ్మ! యిపుడు.

౨

లలిత శృంగార శోభావిరాజమాన
కృతులు రచియించి సత్కీర్తి నెనసినావు
ప్రబల సంగ్రామ కలనకై భయము లేక
లేఁత చేతులఁ గత్తి గీలించినావు
ఘన పతివ్రతా శీల రక్షణము సేయ
నురుతరానల శిఖలలో నురికినావు

వీర పత్నీత్వ ధర్మంబు వేగిరింప
నూరిపోసినావు పతికి వీరరసము
నన్ని శక్తులు నీయందె నలరె నాంధ్ర
సోదరీ! తడవేల రాష్ట్రోద్యమమున?

3

ఆంధ్ర జనని స్వేచ్ఛా వీర మధిగమింప
నాంధ్ర జాతీయతా భావ మనువు జెంద
నాంధ్ర సుస్థిరోజ్జ్వల తేజ మచ్చు పడంగ
నాంధ్ర సౌభాగ్య సుశ్రీల ననుభవింప
నాంధ్ర నగరంబు లందెల్ల నాంధ్ర సోద
రీమణులు సభ ల్జేసి యారీతి, మంత్రి
వర్యులకు సభాపతికిని వార్త లంపి
యాంధ్రరాష్ట్రము ప్రాప్తించు నంతవఱకు
వీడకుండు రాష్ట్రసాధన విమలదీక్ష
నాంధ్రసోదరీమణులార! అమ్మలార!



# తెలుఁగు మేలుకోలు

జంకుం గొంకు దొఱంగి యాంధ్రజనముల్ స్వాతంత్ర్యదోశ్శక్తిని
శ్శంకాహంకృతి దాస్యపీడనము నాశంబౌనటుల్ సేయఁగా
ఢంకాపై నొక దెబ్బతీసి తెలుఁగుల్ ఢాకన్ బ్రచారింప, మీ
వంకం జేరదె రాష్ట్రలక్ష్మి బహుళైశ్వర్యంబు పెంపొందఁగన్.

జాతిం గాంచియు, భాషనుం దలఁచి, నైసర్గస్థితిం జూచియున్
ఖ్యాతిం గన్గొని, కోట్లసంఖ్య జనసంఘాతంబు లక్షించి, వి
ఖ్యాతంబౌ నదులెంచి, యార్థిక సమశ్యన్ బెల్లుయోజించి, సీ
స్వాతంత్ర్యంబిడు నాంధ్రరాష్ట్రమును వేసాధింపుమో ఆంధ్రుడా

రాయల సీమలోఁ గఱవురాయిడి లేక సుభిక్ష మేర్పడన్
సాయము సేయఁగాఁ దగిన సాధన మాంధ్రులరాష్ట్ర; మట్టిచో
న్యాయమె సాటిసోదరుల కక్కట! రాష్ట్రము కంటె ముందుగా
నే యనకట్ట ముఖ్యమనియే వచియించుట లాదవానిలో?

మాకును మీకునుం గలుగు మైత్రిని భంగ మొనర్ప కొందఱత్తే
వో కడు దుష్టమైన పొరపొచ్చెములం బచరింపుచుండి, రా
షోకలఁ గూర్చి లెక్కఁగొనఁ బోవక యత్నము సేయ, రాష్ట్రమే
రాక విలంబనం బగునె రాయలసీమ నివాస సోదరుల్!

ఆంధ్రరాష్ట్రంబు ప్రాపించి నపుడె, తుంగ
భద్ర ప్రాజెక్టు, బందరు పట్టణంపు

టోడరేవు నిర్మించుటయునగు, 'నాంధ్ర
విశ్వవిద్యాలయం' బను పేరు సార్థ
కొమగు; లేకున్న మన యాశయములు సున్న.
తెనుఁగు భాసను గ్గిన తేనెతీపి
నరసి మురిసి 'ఇటాలియన్ ఆఫ్ ది యీస్టు'
అనుచుఁ బాశ్చాత్యులే పల్కిరనఁగఁ, దెనుఁగు
గొప్పదనమును సోదరా! చెప్పవశమె!

తెలుఁగుం జోదులు దేశభక్తియును,జాతీయోద్యమోత్సాహమున్
లలితాదర్శక సంఘసేవనము, స్వార్థత్యాగ సౌశీల్యమున్,
గలవారయ్యు స్వరాష్ట్ర సాధన విధానంబింత మాంద్యంబుగా
గలుపం గూడునె? తీవ్ర యత్నమువినా సాధ్యంబుగాదెద్దియున్.

ఔరా! మాపొలిమేరలోఁబొలుచు పుణ్యక్షేత్ర మాంధ్రావనీ
నారీరత్నము వేంకమాంబ మహిమాన్నత్యంబు తోడన్ దివం
బారోహించిన వేంకటాచలమునం దాంధ్రాధిపత్యంబు లే
దా! రామా! హరి! యాంధ్రదేశమునకీ హైన్యంబు సామాన్యమే

వేంకనబాబు దిబ్బెమున వేలకు వేలు తెలుంగువారు న
ల్వంకల నుండి వచ్చుచు నవారిగవై చెడు తెన్గురొక్కముఁ
దంకక యర్వవిద్దెకని తద్దయు వమ్మొనరింప ద్రావిడుల్
కంకర పట్టు పట్టి రది కాంచి యెటుల్ సహియింతు వాంధ్రుడా!

లేర! తెనుంగుబిడ్డ! యపుడే మన యాంధ్రుల దేశ దక్షిణ
ద్వారము తిర్పతిన్ దమిళభాయిలు ముట్టడిజేసి, రింతటన్
రారె స్వరాష్ట్రమందునఁ బరాకున నుండెదరేల? రెండు మీ
ధీరతఁ జూపి, చెన్నపురి, తిర్పతి, తెల్గుపొలాన నిల్పరే!

అరవలకు గాన భిక్షముఁ
గరుణించిన త్యాగరాజుఁ గన్న తెనుంగుం
బరమ పవిత్రపు దేశము
న, 'రేడియో' పెట్ట రెట్టి నాయము కనుఁడీ!

అదిగో! కన్నులు విచ్చి గాంచుమిపు డయ్యంగార లొక్కుమ్మడిన్
'మదరాసెన్నటికైన మాదె' యని పంతాలాడుచున్నారు; నీ
వది సైరించిన నెత్తికెక్కి 'గుటకాయస్వాహ' గావించియున్
'బదవయ్యా! తెలుఁగయ్య' యంచుఁబలుకన్ సన్నద్ధులై రప్పుడే.

మూఁడు శతాబ్దముల్ గడచి పోయెను జెన్నపురమ్ము నాంధ్రులే
పోడిమి నిర్మితి న్సలిపి; పూర్వపు టాచరితం బెఱింగి, వా
డ్వాఁడెదరేలనో యరవ లయ్యయొ! నెయ్యముసూప, రింక నే
మాడిన నేమి చెన్నపురి యాంధ్రులదే! యనుమానముండునే?

తనవాఁడెంతటి కోవిదుండయిన సత్కారంబు గావింప క
న్యునకున్ బ్రహ్మరథంబు పట్టుటది యేదో పాడునాచార మ
య్యెనుబో నేఁటి తెలుంగువారికి కతంబేమో? తెలంగాణపుం
ఘనులన్ భారతరాజ్య తంత్ర కలనా గాంభీర్యులన్ గాంచరే!

# ప్రబోధము

ఆంధ్రనాయక మణి యగు మన పట్టాభి
　　కాంగ్రెసు ప్రసిడెంటు కాకయుంట,
శత్రు మత్తేభ కేసరి ప్రకాశమనీషి
　　ముఖ్యమంత్రి పదంబు పొందకుంట,
మన రాష్ట్ర వివరంబులను నిండియా మంత్రి
　　కింతవఱకు నెఱింగింపకుంట,
తెలుఁగు సీమను గల్గు తిరుమల క్షేత్రాన
　　నాంధ్రాధికారంబు నలరకుంట,
కఱవులు తఱచుగాఁ గలుగు రాయలసీమ
　　కనకట్ట విషయంబు నరయకుంట,
ఒక చిన్ని యాంధ్ర యుద్యోగమునకునైన
　　నరవలు దిగుమతి యగుచునుంట,
సంగీత సాహితీ స్థలమైన మన వీట
　　రేడియో స్టేషను లేకయుంట,
తెలుఁగు జిల్లాలలోఁ దొలుత, మద్య నిషేధ
　　చట్టంబు నమలును జరుపకుంట,
ఆంధ్రుల మునిసిపాలిటీ లందున వ్యభి
చార నిర్మూల చట్టంబు నలుపకుంట,

విడిగ రాష్ట్ర తీర్మానంబు పెట్టకుంట,
రాష్ట్రసాధన కభ్యంతరములు గావె!

చీరాల పేరాల సిసలైన వస్త్రాల
నొల్లక బొంబాయి మిల్లు వేల?
బందరు బెజవాడ ఫార్మసీ లుండఁగా
జండుఫార్మసి మందు దండుగేల?
పెద్దాపురపు నేత పీతాంబరము లుండ
చీకిపోవు జపాను సిలుకు లేల?
కమ్మని పలనాటి ఖద్దరు మన కుండ
పరరాష్ట్రముల ఖాది పనియదేల?
వలసినంత స్వదేశి పంచదార గలుగ
నితరదేశపు దిగుమతు లవేల?
మన గ్రామములలోనె మాదిగ లుండంగ
కాన్పూరు చెప్పుల కర్మమేల?
కస్తూరివలె తెల్గు ఘాటు పొగాకుండ
'గోల్డుఫ్లేక్' సిగరెట్లు కొనఁగనేల?
నాణెదు మన సీమ నార ఫ్యాక్టరు లుండ
కలకత్త గోనెల గతియదేల?

కనఁగ, దూరపు కొండలు నునుపెకాని
దాపునన్ రాళ్ళు గుండ్లు విధంబుగాగ

నాంధ్రుడే స్వదేశిని నిరాదరింప
రాష్ట్రసాధన కభ్యంతరంబు గాదె!

అరవల హిందూస్థాను, దొరల మెయిలే కాని
ఆంధ్రపత్రిక చెప్పు డంటఁబోరు
'మోడరన్ రెవ్యూకు' మోజు జెందుదు కాని
భారతి గృహలక్ష్మి పట్టఁబోరు
హిట్లరు చరితంబు నెఱుఁగఁ గోరికె కాని
ఆంధ్రరక్షు చరిత్ర నరయఁబోరు
హిందీకృతుల నుతియింపుచుండుదు కాని
వెంకటేశ్వరు కృతుల్ వినఁగఁబోరు

ఆంధ్ర రాష్ట్ర ప్రచారంబు నరసికూడ
కొంతమంది తెలుంగుల కింతవఱకు
పోకయుండెను పొరుగింటి పుల్లకూర
మెచ్చుకొను పిచ్చితన మది మేలుకాదు.



# రాష్ట్రసిద్ధి

మన తెనుఁగు బాసతో శా
సన సభలందునను గూడ చర్చింపుటకై
అనుమతి ఒసఁగంబడినది
కనుఁడీ! యిది రాష్ట్రసిద్ధి కావుటకె సుమీ!

సంకటముల్ బదింపదిగ సంభవమైనను వెంట నంటి యా
టంకము లెన్నియేని మిము డాసిననైనను రాష్ట్రసిద్ధికిం
గంకణముం ధరింపుఁడు పోకార్పుఁడు ద్రావిడ దాస్యభారమున్
గొంకక నెల్లరాష్ట్రములకుం దెలుఁగుం బసఁ జూపుఁడి త్రతిన్

కుసుమించెంగద యిర్వదీవఱకు తళ్కుంగుల్కు పుష్పంబు లాం
ధ్ర సభావల్లరి కైననేమి యవి స్వాతంత్ర్యంపు సౌగంధ్యముల్
గొసరన్ జిమ్మఁగలేదు; నూతనముగా గుంటూరు గోష్ఠ్యాకృతిన్
గుసుమం బొక్కటి విచ్చె నేఁడు మనకుం గొంగ్రొత్త నెత్తావిడన్.

బాధాలేశము లేక శీఘ్రముగ దివ్యద్రాష్ట్ర మిప్పట్టునన్
సాధింపంబడుఁగాత! ఆంధ్రులకు స్వేచ్ఛాశక్తి సంభూతమా
నాధిక్యంబు సెలంగుఁగాత! పరదాస్యంబెల్లఁ బోకార్చి, యాం
ధ్రాధీనం బగుఁగాత! పాలన సమస్తైశ్వర్య సంధాయిమై.!



# ఆశయము

'జీర్ణము వాతాపి జీర్ణ' మటంచును
లాలించి మాకుగ్గు పాలఁబోసి
'శ్రీరామ రక్షయు నూరేండ్ల ఆయుస్సు'
నెలకొను నంచును నీళ్లువోసి
'వీర రక్తపుటేరు వెల్లువ యై మేన
పాఱు' నంచును జనుబాల నిచ్చి
'స్వేచ్ఛాంబునిధిలోన జీవనౌకాయాన
మును జేయు' మంచును బువ్వ బెట్టి

పెంచి పెద్దవారలఁ జేసి వెనుకఁగన్న
సంతతికి వోలె నాంధ్రతేజము నొసంగి,
స్వీయ రాష్ట్రము సమకూర్పఁ జేయుమమ్మ!
అఖిలదేశైకవిఖ్యాత! ఆంధ్రమాత!

అలరారుఁగాత! మా యలఘు పౌరుషశిఖ
దీప్తిఁ జెందిన యాంధ్రదేశమందు
చెలువారుఁగాత! మా శిల్ప కలాపంబు
గణనకెక్కిన తెలంగాణమందు
వెలరారుఁ గాత! మా విశ్వమోహనగీత
పూతమైన త్రిలింగ భూమియందు

వీలరారుఁగాత! మా కలిమి సింగారంబు
శ్రీ వెలుంగు తెలుంగు సీమయందు

వెలయుఁ గావుత! మా కైత మధురగతిని
తనరుఁ గావుత! మా మంత్ర తంత్ర మహిమ
వరలుఁ గావుత! మా రేవుపట్టణములు
వెలయుఁ గావుత! మా కీర్తి పృథివియందు.

వివిధ రాష్ట్రములందున వెలయుఁ దెలుఁగు
కండికలు నెల్ల నొకటిగాఁ గలిసి, మాదు
ఆంధ్రరాష్ట్రము నిర్మాణ మగునుఁగాత!
చెన్నపురి ముఖ్యనగరమై చెలఁగుఁగాత!